Regd No. N. 40 M. 3813

వెల ఒక అణా

★ క్రీటునుండి బ్రిటిషు విమానాల నిర్గమనము ★

# గోలకొండ పత్రిక

★ ఇరాఖులో రెజెంటు ప్రవేశము ★




102561

సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర జ్యేష్ఠ శు॥ ౩ (౨౯-౫-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౨

# క్రీటులోనుండి బ్రిటిషు విమానములతొలగించుట

## బ్రిటిషు, జర్మను సేనలకు ఘోరయుద్ధము

క్రీటుదీవిలో బ్రిటిషు సేనలకును జర్మను సేనలకును ఇంకను ఘోరయుద్ధము జరుగుచున్నది. ముష్టిముష్టిగ పోరులు జరుగుచున్నవి. హెరాక్లియన్ అను రేవునుండియు, రెథిమ్నోనుండియు చానియాయందు విమానాలనుండి దిగియున్నట్టి జర్మను సేనలను బ్రిటిషు సేనలు మే ౨౩ వ తేదినాటి యుద్ధంలో పూర్తిగా తరిమివేసినవి. మాలెమి విమానాశ్రయమునకు తూర్పున ఉండు స్థానములో బ్రిటిషు సేనలున్నవి. మాలెమి విమానాశ్రయము జర్మనుల వశమందేయున్నది. ఇక్కడినుండి కూడ జర్మనులను తరిమివేయుటకు బ్రిటిషు వారు ప్రయత్నించుచున్నారు గాని జర్మనులు క్రొత్తగా వచ్చుచున్న తమ సేనలను విమానాలనుండి దిగుటకు స్థానము ఉండవలెనని పట్టుదలతో మాలెమిని నిల్పుకొనుటకై ఘోరముగ పోరాడుచున్నారు. ప్రతిరోజును జర్మను విమానములలో సేనలను, ఫిరంగులను, సేకుంజీ దిగుచు చేయుచున్నవి. యుద్ధసామగ్రియును సామగ్రి కూడ దిగుచు చేయుచున్నది, ఇదంతయు భూమిపై దిగిన ౧౦ నిమిషాలలోనే జర్మను సైనికులు పోరాటమునకు సన్నద్ధులు కాగలరు. అందువలన సేనలను అను కుడిచివేయుటకు బ్రిటిషు వారు ప్రయత్నించుచున్నారు. జర్మనులు తమకు కలుగుచున్న నష్టములకు లెక్కచేయక క్రొత్త సేనలను నిరంతరము రాకపోక లడించుచు చేయుచున్నారు. ఆ సేనలు దిగినవారిలో చాల అచోట్లనుండి వశముచేసి కొనుచున్నవి.

గ్రీసునుండి సముద్రంమీదుగా ఓడలలో కూడా సేనలను, ఫిరంగులను క్రీటుదీవిలో దించుటకు జర్మనులు యత్నించినారు. కాని ఆ ప్రయత్నము విఫలమైనదట్లు బ్రిటిషు వారు చెప్పుచున్నారు. మే ౨౧ వ తేదిరాత్రి జర్మనులు తమ సేనలను ఓడలలో క్రీటుకే గారె దుకోడలు బ్రిటిషు వారిచే ముంచివేయబడెను. వాటికి తోడుగా వచ్చుచుండిన డిస్ట్రాయరు నౌకయొకటి కూడ ముంచివేయబడినది. మే ౨౨ వ తేదిన కూడ ౩౦ జర్మను నౌకలు కనిపించగా బ్రిటిషు నౌకలు వాటిని ఎదిరించెను. అంతట అవి జర్మను పేలాగో దీవుల వైపు పోయెనట.

క్రీటుదీవిలో బ్రిటిషు వారి విమానాలు నిలుచుటకు విమానాశ్రయములు తగినవి లేవియు వారలవశములో లేనందువల్ల వారు తమ విమానాలను ఆదీవినుండి తొలగించివేసినారు. క్రీటులో జర్మనులకు టాంకులు, ఫిరంగులు లేవట. మరి బ్రిటిషు వారికి ఉన్నవా అని బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో చర్చిలుగారినడుగగా, అందుకు చర్చిల్ గారు "ఆ విషయమును అవిధంగా నేనువిచారించవలెనని ఆలోచించలేదని చెప్పిరి.

ఇప్పుడు క్రీటుదీవిలో జర్మనులపై బాంబులువేయు బ్రిటిషు విమానాలు ఈజిప్టులో నుండి వచ్చుచున్నవి. మే ౨౦ వ తేది రాత్రి బ్రిటిషు విమానాలు క్రీటులో నాలుగు జర్మను విమానాశ్రయాలపై బాంబులను వేసినవి. మే ౨౩ వ తేదిన మాలెమి విమానాశ్రయంపై బాంబులను వేసి జర్మనులకు చాల నష్టం కలిగించినవట. ౧౦ జర్మను విమానాలు ధ్వంసము చేయబడినవట. క్రీటుపై జర్మనుల దండయాత్ర ప్రారంభమైనది మొదలు ౧౨౦ జర్మను విమానములు (సేనలను తెచ్చేటివి) ధ్వంసము చేయబడినవట.

మే ౨౪ వ తేదిన న్యూజీలెండు ప్రధానియగు మిస్టర్ ఫ్రేజర్ గారు రూటర్ ప్రతినిధితో ముచ్చటించుచు రాబోవు కొద్ది గంటలలో క్రీటులో యుద్ధము నిర్ణయము కాగలదనియు బ్రిటిషు సేనలు, వాటితో కలిసి పోరాడుచున్న న్యూజీలెండు సేనలు, ఆస్ట్రేలియా సేనలు, గ్రీకు సేనలున్ను గెలువగలవనియు తనకు తోచుచున్నదని చెప్పిరి.

అమెరికా వ్యవహారము

అమెరికా వారు ఇంతవరకు బ్రిటనుకు సేనలసహాయము మినహా తక్కిన యుద్ధావసర సహాయమును సంతయు చేయుచున్నారు. ఇప్పుడు సేనలను కూడ పంపించవలెనను ఆందోళన అమెరికాలో వ్యాపించుచున్నది. అమెరికా నౌకా శాఖమంత్రియగు కర్నల్ నాక్సు గారు 'న్యూట్రాలిటీ ఆక్టు' అను శాసనమును రద్దుచేసి అమెరికా ఓడలను బ్రిటిషు రేవులకు ఇంకను ఇతర యుద్ధ ప్రాంతములకును పంపించవలసినదని మే ౨౨ వ తేదిన నొక్కి చెప్పినాడు. కాని ప్రజలలో ఇంకను చాలమంది ఈవిషయంలో గట్టిగా తీర్మానించుకొనకుండా ఉండుటవల్ల రూజ్వెల్టు గారు కూడ గట్టిగా తీర్మానము చేయుకయున్నారని ఒక విలేఖరి అనుచున్నాడు.

అమెరికాలో యుద్ధావసర సామగ్రులను బ్రిటనుకై తయారు చేయుటకు కోరబడిన కొన్ని యంత్రశాలలలో పనివారల సమ్మెల బెదరింపులు ఇంకను చిటికిమాటికి జరుగుచు చేయుండుట చూడగా ఈ సమ్మెలను అమెరికానుండి యుద్ధము చేయుచుండే దేశాలకు యుద్ధ సామగ్రిని పంపరాదని తలచేవారట పురికొల్పియుందురా అని అనుమానము కలుగును, భోగ్గుగనుల సమ్మె కూలీల జీతములను హెచ్చించుటచే ఇప్పటికి తాత్కాలికముగ విరమించబడినది. కాని ౩౫౦౦౦౦ మంది పనివాండ్రు జేరియుండే రైల్వే యూనియనులు ఇంతవరకున్న జీతాలను మాటికి ముప్పదివంతున హెచ్చించవలసినదని ఒత్తిడి చేయుచున్నారు. దీనిలోనుండి కూడ సమ్మె పుట్టునో, లేక మొదట నే వ్యవహారము శాంతిపరచబడునో తెలియదు.

అమెరికా ఎప్పటికంటె ఇంకా ఎక్కువ వడిగను, ఇంకా వేగముగా పోగలవి నిర్మించబడునని యువాటిలో స్వాతంత్ర్యముగల దేశములకు సంభవించిన భయములతొలగించుటకై యుద్ధసామగ్రి సహాయము పంపబడునని యు రూజ్వెల్టు గారు ప్రకటించినారు

అమెరికా శాసనసభయగు ప్రజాప్రతినిధి సభలోని నౌకా సంఘము వారు మే ౨౨ వ తేదిన ఆమోదించిన ఒక అసాధారణ శాసనము వల్ల కొన్ని ప్రత్యేకమైన సైనిక దళములను అవసరమైనచోట్లలో ఉపనౌకా నాయకులనియమించుటకు అధికారమిచ్చుచున్నది. ఆ శాసనసభ వారు మే ౧౯ వ తేదిన ౩౫౦౦౦౦౦౦౦ డాలర్లఖర్చుతో ౫౫౦ చిన్న నౌకలను నిర్మించుటకు ప్రభుత్వము వారికి అనుమతినిచ్చిరి

రూజ్వెల్టు గారు అజోర్సు, కేప్ వర్డీదీవులు, ఆఫ్రికా యొక్క పడమటి బుజుపు-ఇవియన్నియు పశ్చిమార్ధగోళములో చేరినవేయనియు, అందువల్ల వీటిపై దండెత్తివచ్చేవారు అమెరికా అధికారం ఉండవలసినస్థలాలలో దండయాత్ర జేసినవారగుదురనియు ఒక సందేశమును కాంగ్రెసుకు పంపదలచిరని ఒక వార్తవచ్చియుండెను గాని, తర్వాత మే ౨౦ వ తేదిన రూజ్వెల్టు గారు అట్టి సందేశమును దేనిని గాని ఇప్పుడు పంప దలచుకొనలేదని చెప్పినారు,

ఇప్పుడు అమెరికా వారు తమ రేవులలోనుండే జర్మనీ, ఇటలీ, రాజ్యాల నౌకలను వశపరచుకొనిన ట్లును దానివిషయములో జర్మనీ, ఇటలీల ప్రభుత్వములు ఆక్షేపణ తెలిపినట్లును ఇదివరలో వినియుంటిమి ఇప్పుడు ఫ్రెంచి వారి ఓడలను అమెరికా రేవులలోనున్న వాటిని అమెరికా ప్రభుత్వము వారు వశపరచుకొనుటకు యత్నించుచున్నారు, ఇందుకు ఫ్రెంచి ప్రభుత్వము వారు ఆక్షేపణ దెల్పినారు—

ఈప్రకారంగా అమెరికా సంయుక్తరాజ్యము వారు లాగుకొనిన ఓడలను దక్షిణ అమెరికాలోని రాజ్యాలకు ఓడలు తక్కువగానున్నందువల్ల యివ్వవలెననియు, మిగిలినవాటిని బ్రిటిషు వారికీయవలెననియు ప్రచారము చేయబడుచున్నది. దక్షిణ అమెరికా రాజ్యాల రేవులలో పనిలేకుండా ఉంటున్న కొన్ని విదేశ నౌకలను కొనుటకై బ్రిటిషు వారు రాయబారాలు సాగించుచున్నారు.

పశ్చిమార్ధగోళంలో ఉండే ఫ్రెంచి రాజ్యభాగాలను అమెరికా సంయుక్తరాజ్యానికి సంపాదించుటకై ఫ్రెంచి ప్రభుత్వముతో అమెరికా ప్రభుత్వము వారు రాయబారములు సాగించవలెనని కోరు ఒకచిత్తుశాసనము అమెరికా శాసనసభయగు ప్రజాప్రతినిధిసభలో మే ౧౯ వ తేదిన ప్రవేశపెట్టబడినది. పడమటి ఆఫ్రికాలో ఉండే డాకారు జర్మనులకు చిక్కకూడదని అమెరికా వారు జాగ్రత్తవహించుచున్నారు, అమెరికా వారు ఫ్రెంచి వారి మార్టినిక్ దీవిని పట్టుకొనజూచుచున్నారని ఫ్రెంచి వారు అనుమానించి, తమ మార్టినిక్ దీవిని పట్టుకొనుటకై ఎవరు యత్నించినను ప్రతిఘటించెదమనుచున్నారు. అమెరికా వారు మాకు మార్టినిక్ దీవిని వశపరచుకొనవలెనని అపేక్ష లేదనుచున్నారు.

ఐర్లెండు వారి కోరికపై అమెరికా వారు, ఐర్లెండుకు రెండు ఓడలనమ్ముటకును ౫ లక్షల డాలర్ల విలువగల ఆహార పదార్థములను పంపించుటకును ఒప్పుకొన్నారు. ఆయుధ సామగ్రిని యుద్ధం చేయుచున్న దేశాలకు తప్పితే ఇతర దేశాలకు పంపించేలేదు కనుక ఐర్లాండుకు ఆయుధ సామగ్రి పంపించ వీలులేదనినారు.

ఇరాఖు వ్యవహారము

ఇరాఖులో బ్రిటిషు సేనలు ఫలూజాను ఆక్రమించియుండెను గదా ఫలూజా పరిసరములలో చేరియుండిన రషీదలీ సేనలు మే ౨౧ వ తేది రాత్రి ఆ బ్రిటిషు సేనలనెదిరించి ఫలూజాను తిరిగి రాబట్టుకొనుటకై యత్నించినవి. లోపలినుండి బ్రిటిషు సేనలను తాత్కాలికముగ బయటికి తరిమివేసి పట్టణములో చేరినవి కాని బ్రిటిషు సేనలు మరల వాటినెదిరించి తరిమివేసి ఫలూజాను ఆక్రమించినవి తర్వాత అక్కడినుండి పారిపోవుచుండిన రషీదలీ సేనలపై బ్రిటిషు విమానాలు బాంబులను వేసినవి, బ్రిటిషు వారి హబ్బానియా విమానాశ్రయముపై జర్మను విమానాలు బాంబులను వేసినవి, ఇప్పుడు యూఫ్రెటీసు, టైగ్రిసు నదులలో వరదలువచ్చియున్నందువలన సేనల సంచారమునకు అనుకూలము గానున్నది అందువల్ల పోరాటము ఇప్పుడు సరిగా సాగుచుండుటలేదు బాస్రాలో శాంతము గానున్నది మోసూలులో విమానాశ్రయములపై బ్రిటిషు విమానాలు మే ౨౪ వ తేదిన బాంబులు వేసెను.

ఇదివరలో బాగ్దాదునుండి పారిపోయిన, ఇరాఖు రీజెంటు అగు అబ్దుల్ ఎలాహి గారు ఇప్పుడు ఇరాఖుకు తిరిగివచ్చినట్లు వార్త వచ్చినది వారు స్వాతంత్ర్య ప్రతినిధిగ పూర్వ మొకప్పుడు ఇరాఖు ప్రధానమంత్రిగనుండి జమీల్ మాద్ఫి గారిని పంపినారు. అమరా మసాజీయాలలో షేకులును, బాస్రాలోని ఇరాఖులును రీజెంటు గారియెడ తమకు భక్తి విశ్వాసములున్నవని తెలియజేసినారు. త్వరలో రీజెంటు గారు బాగ్దాదుమున్నగునగరాలపై విమానాలలోనుండి తానువచ్చినసంగతిని తెలుపుచు, ఇరాఖు ప్రజలందరు తనకు తోడ్పడవలసినదని ఒక సందేశముద్వారా విజ్ఞప్తి చేయించెదరట-బాగ్దాదులో తాత్కాలికముగ నొక ప్రభుత్వమును ఏర్పాటుచేయు విషయమై ఆలోచించుచున్నారట.

ఇప్పుడు రషీదలీ గారు బాగ్దాదునుండి మోసూలుకు పారిపోయినారనియు అక్కడ వేరే ప్రభుత్వమును స్థాపించదలచియున్నారనియు, వారి సేనా నాయకులు వారిపై తిరుగుబాటు చేయుచున్నారనియు నమ్మకముదిక్కుని వదంతులు విపరీతంగా తురుకీలోని అంకారాలో ఎవరిచేతనో వ్యాపింపజేయబడుచున్నవి,

రషీదలీ పక్షము వారికి ఫ్రెంచి వారినుండి యుద్ధసామగ్రి లభించుచున్నట్లు బ్రిటిషు ప్రభుత్వంవారికి తెలిసినదట.

ఇప్పుడు బ్రిటిషు సేనలు బాగ్దాదుకు ౨౦ మైళ్ళ దూరంలోనున్నవి.

సిరియా

సిరియాలో ఫ్రెంచి అధికారులకు జర్మను సైనికాధికారులు సలహాల నిచ్చుచున్నారట, సిరియాలోనుండి కొందరు ఫ్రెంచి సైనికులు పాలెస్టయినులో ఉండు డీగాల్ పక్షీయ ఫ్రెంచి సేనలతో చేరుచున్నారు సిరియాలో ప్రసిద్ధిగల కొలెట్ ఫ్రెంచి సైనికాధికారి అనేక ఫ్రెంచి సైనికులతో పాలెస్టయినుకు పోయిచేరినాడట. మే ౨౪ వ తేదిన కొన్నివందల ఫ్రెంచి సేనలు సిరియానుండి పాలెస్టయినులోకి పోయినవి కాని సిరియాలో డీగాల్ పక్షీయ ఫ్రెంచి సేనలు చేరియున్న మాటను అందరులోని వారు ఒప్పుకొనడంలేదు. సిరియాకు, పాలెస్టయినుకు మధ్య సరిహద్దు దాటి ఎవరునుండుకుండునట్లు నిర్బంధ మేర్పరచబడినది.

తురుకీ

బాగ్దాదులో ఎవరో ఒక కొలంపులోనుండిన ఒక తురుష్కుడు బ్రిటిషు విమానములకు సంజ్ఞ చేసెనని కొందరు గుంపుగా చేరి అతనిచంపివేసిరి. ఈ విషయమై సమాధానము చెప్పవలసినదని తురుకీ ప్రభుత్వము వారు ఇరాఖు ప్రభుత్వమునకు వ్రాసినారు, తురుకీ రాజ్యమును శత్రువులనుండి రక్షించుటకు అవసరమైన ఏర్పాటులు చేయుటకు మరి ౧౦ లక్షల తురుకీ యు పౌనుల అప్పు చేయుటకై తురుకీ ప్రభుత్వము వారు తమ పార్లమెంటునుండి అనుమతినపేక్షించినారు. జర్మనులు యంత్రములను, రైల్వే సామగ్రిని, యుద్ధసామగ్రిని తురుకీకి అమ్మి దానికి బదులుగా తురుకీనుండి రాగిని తోళ్ళు పదును చేయువస్తువులను, అన్ని విధములగు ఆహారపదార్థములను పొందునట్టి ఏర్పాటునొకదానిని కుదుర్చుకొనుటకై యత్నించుచున్నారు. అందుకై తురుకీలోని జర్మను రాయబారియగు వాన్ పేపను గారు మే ౨౪ వ తేదిన తురుకీ విదేశాంగ కార్యాలయాధికారులతో సంభాషించిరి.

యుగోస్లావియా

యుగోస్లావియాలో జర్మను లేర్పాటు చేసిన క్రోటు రాజ్యము యొక్క ఉపప్రధాని అగు డాక్టరు రాజాక్రెసెవికు గారు డాల్మేషియాను ఇటలీ వారు తీసికొన్నందుకై ఆగ్రహమును తెల్ల గ్రక్కినట్లును, తిరిగి సమయము చిక్కినవెంటనే ఆభాగమును సంపాదించి క్రోషియాలో కలుపుకొనుటకు క్రోటులు యత్నించగలరని చెప్పినట్లును జెనీవానుండి వచ్చిన మే ౨౪ వ తేది నాటి వార్తలోనున్నది క్రోషియా రాజ్యమును భిన్నముచేసి ఏర్పరచినందుకై యుగోస్లావియా ప్రభుత్వము ఆగ్రహించుచున్నదను మాటను గల ఒక పత్రమును అమెరికాలోని యుగోస్లావియా రాయబారి మే ౨౪ వ తేదిన అమెరికా విదేశాంగ మంత్రియగు కార్డెల్ హాల్ గారికి అందజేసినాడు

గ్రీసులో ఆస్ట్రేలియా సేనల నష్టములు

ఆస్ట్రేలియా సేనలు గ్రీసులో యుద్ధములో పాల్గొనియుండెను గదా! ఆ సేనలలోనుండి ౩౯౮౩ మంది గాయాలవల్లను, మరణాలవల్లను నష్టమైనారు

ఆఫ్రికాలో యుద్ధము

ఆఫ్రికాలో యుద్ధమందు లిబియారంగంలో సోలంవద్ద జర్మను సేనలు ఈజిప్టు సరిహద్దు దాటి పోవుటకై మే ౧౬ వ తేదినాడును, మే ౨౩ వ తేదినను యత్నించి ముందుకుపోయినవి కాని బ్రిటిషు సేనలు వాటిని వెంటనే తరిమివేసినవి, ఇందువల్ల జర్మనుల ముందు నడక సాగకున్నది.

రెండవది అబిసీనియా రంగము, ఈ రంగములో మే ౧౯ వ తేదిన అంబా అలాగిని బ్రిటిషు సేనలు వశపరచుకొనినవి ఇక్కడి కోట చాల బలిష్టమైనది, ఇక్కడినుండి ఉత్తరమునకును దక్షిణమునకు బాటలున్నవి. అందువల్ల ఇది ముఖ్యమైనది మే ౨౦ వ తేదిన అబిసీనియాలో ఇటాలియను సైన్యాధిపతియగు ఆయోస్టాడ్యూకు గారు తమ అంగరక్షకులతోను అధికారులతోను బ్రిటిషు సైనికాధికారులకు వశపడిపోయిరి. ఎనిమిది తొమ్మిది వేలమంది ఇటాలియను సైనికులిక్కడ బ్రిటిషు వారికి ఖైదీలైనారు.

అబిసీనియాలో గోండారు ప్రాంతమందును, జిమ్మా ప్రాంతమందును ఇటాలియను సేనలు బ్రిటిషు వారికి ఇంకను లొంగకుండా పోరాడుచున్నవి. ౧౯ వ తేదినాటికి ఇక ఒక ముఖ్యస్థానమును కూడా సురక్షక సేనలు పట్టుకొన్నవి. దక్షిణ ప్రదేశములలో బ్రిటిషు సేనలు స్కియాస్కియా మన్నాకు దక్షిణమున ౨౫ మైళ్ళదూరంలో నాలుగైదువేలమంది కలియు పోటగు దాల్లేలనుచోటిని బ్రిటిషు సేనలు మే ౧౬ వ తేదిన పట్టుకొన్నవి. మే ౨౧ వ తేదినాటికి బ్రిటిషు సామ్రాజ్య సేనలు సొద్దుకు ఉత్తరమున ౧౨౫ మైళ్ళదూరంలో ఇటాలియనులను చేపట్టగావచ్చినారు మే ౨౨ వ తేదినాటికి ౨౨ విజయుల ఇటాలియనుల సేనలు అబిసీనియాలో బ్రిటిషు సామ్రాజ్య సేనలకు మధ్య చిక్కుకొన్నవి. ౨౨ వ తేదినాటికి స్కియాస్కియా మన్నాకు వాయువ్యమున ౨౫ మైళ్ళదూరంలో గేలంటు అను స్థానము, అక్కడికి పడమట విలాసదివిటి స్థానము ఇంకను దక్షిణమున డాల్లేకు ౩౦ మైళ్ళదూరమున దక్షిణమునందు ఉవాలేపిఅను స్థానము, దానికి తూర్పు వాయవ్యదిశన ౨౨ మైళ్ళదూరంలోనుండు హోలా అను స్థానము, ఇవి అబిసీనియాలోనివి బ్రిటిషు వారిచే పట్టుకొనబడినవి, సోమాలీలాండులో గర్దాఫూయి లైట్ హౌస్ పట్టుకొనబడినది మే ౨౪ వ తేదినాటికి అబిసీనియాలో ఉండిన బ్రిటిషు సేనలు ౧౨ లో వాండేకు చేరినవి.

ఇప్పుడు అబిసీనియాలో ప్రధాన యుద్ధము లేక డిస్ట్రిక్టులో జరుగుచున్నవి. ఆఫ్రికాలో శత్రు ప్రదేశాలపై బ్రిటిషు విమానాల దాడులు జరుగుచున్నవి.

## నిజాంరాష్ట్ర అష్టమాంధ్ర మహాసభ పర్పాటులు

చిలుకూరు, ౨౦-౫-౪౧

చిలుకూరులో జరుగబోవుమహాసభకు కావలసినపర్పాట్లజేయించుటకై, మహాసభాధ్యక్షులగు మం-రామచంద్రరావు గారును, ౨-సం-అధ్యక్షులగు గోపాల్ రెడ్డిగారును, హైదరాబాదునుండి యొకరినిపంపినారు వారువచ్చిన ౧౫ రోజులనుండి మండపనిర్మాణాదులు జరుగుచున్నవి మం-రామచంద్రరావు గారును. ఆహ్వానసంఘాధ్యక్షులగు గోపాల్ రెడ్డిగారును ౩ పర్యాయము వచ్చిచూచి మరల తిరుగ్నాడు వచ్చెదమని వెళ్లిపోయిరి. మరియు, జేకవోలు గ్రామ జలీమహాసభనిచ్చుటకాహ్వానించినవారు గావునదీనికి కావలసినపర్పాట్లలో వారిసహాయముకూడ అవసరమని నారు జేకవోలునివాసులైన మంత్రిప్రగడ రాజగోపాలరావుగారితో చెప్పి వెళ్ళిరి

రాజగోపాలరావుగారు అచ్చోగ్లగూడెం జెట్టిపోతులగూడెం మున్నగు చుట్టుపట్లగ్రామాలకుపోయి అక్కడి ప్రజలను సహాయమర్థించిఊరుకుఒకరు ౧౦౦ మంది వా॥ మూడుదినములుపని చేయుటకేర్పాటుచేసిరి. ఆ మనుష్యులను పెట్టుకొని హైదరాబాదునుండివచ్చిన బోజంగారు గాలియనక ఎండయనక శ్రమపడిశ్రద్ధతో పనిచేసి చేయించి, మహాసభామండపమును, ప్రతినిధులబసలను దుకాణములనుతయారుచేయించి తిరిగి హైదరాబాదుకుపోయిరి.

ఆ క్రొత్త చిలుకూరు ప్రాతచిల్కూరు అనురెండుగ్రామములుగలవు. రెండుగ్రామాలకు పటేలుపట్వారీలు ఒకరే. వీరుమంత్రిప్రగడ వెంకటప్పారావు, కొండపల్లిఅనంతరామయ్య గారు వీరుయీరెండూళ్ళకుపోయి, మహాసభ కట్టిసహాయము చేయుటకుగాని సభకుహాజరగుటకుగాని పూనుకొనినవారికి ౬ మాసములుజైలుశిక్షవిధింపబడునని హెచ్చరించుచు డప్పులతో చాటింపజేయుచు ప్రజలనుబెదరగొట్టుటచే ప్రజలుభయపడి మంటపాదినిర్మాణముల కట్టిసహాయములను చేయుటమానుకొనిరి. ఆహ్వానసంఘాధికారులు, నిన్న, మొన్న నొక్కరొకరేవచ్చిరి, ఈ పొగ్య తూలకుగెడ్డలగుటచే వారురాలేకపోయిరట, ఇక్కడిపరిస్థితులిట్లున్నవి.

ఇంతవరకు నీటివసతులేవియు కల్పింపబడలేదు. బావిపూడికతీయించుటకు ౫౦ రూ. గుత్తయీయబడినవి. హోటల్ వారొకరువచ్చిఎందువల్లనో తిరిగిపోయిరి.

## సదాశివపేట

ఆర్యసమాజ వార్షికోత్సవము

(ఒ-వి)

ఈరోజులలో సదాశివపేటలో ఆర్యసమాజపు త్రితర్షికవార్షికోత్సవము జరుపబడెను ౧౫-౫-౪౧ ప్రాతఃకాలము ఎనిమిదిఘంటలకు స్వామిరామేశ్వరానందు పం వినాయకరావు (ప్రధాన్ ఆర్యప్రతినిధిసభ భాగ్యనగర్), పం-నరేంద్రజీ పం బన్సీలాల్ (మంత్రి,ఆర్యప్రతినిధిసభ, పం-దత్తాత్రేయప్రసాద, పం-భద్రదేవుజీ, పం-వెంకటేశ్వర్ రావు మొదలగువారందరిని మహావైభవముగ స్వాగతముచేసి ఆర్యసమాజ పెండాలులోనికితీసుకవచ్చిరి.రాగా వేపం-వెంకటేశ్వరరావుగారి ప్రార్థనానంతరము స్వామీరామేశ్వరానందు గారి వ్యాఖ్యానముఅనంతరము మధ్యాహ్నము శంకాసమాధానముచేయబడెను, అతర్వాతవకలు పం. వెంకటేశ్వరరావు పం-భద్రదేవుజీ, పం-నరేంద్రజీ, శ్రీమతి శాంతదేవిగారు మరియు శ్రీమాన్ పం-వినాయకరావుజీ విద్యాలంకార్ గారి విద్వత్తాపూర్ణభాషణలుజరిగెను

౧౬-౫-౪౧ ప్రాతఃకాలము హవనము తర్వాత శ్రీమాన్ పం-వినాయకరావుజీగారి కరకములతో ధ్వజారోహణఅయెను. పం-భద్రదేవుజీగారిఉపదేశముఅయెను. మధ్యాహ్నం పం. నరేంద్రజీగారిఅధ్యక్షతలో యువకసమ్మేళన గావింపబడెను అతర్వాత మధ్యాన్నము పం-బన్సీలాల్ శ్యామ్, పం-నరేంద్ర, పం. వెంకటేశ్వరరావు,పం-భద్రదేవు, శ్రీమతి శాంతదేవి శ్రీమాన్ స్వామి రామేస్వరానందు గారలభజనవ్యాఖ్యానములు అయెను.

౧౭-౫-౪౧ ప్రాతఃకాలము హవనానంతరము పం-బన్సీలాల్ వ్యాస్ భజనము, తర్వాత శ్రీమాన్ పం రామేశ్వరానందు గారి ఉపదేశములుజరిగెను మధ్యాహ్నం శంకాసమాధానానంతరము శ్రీమతిశాంతిదేవిజీ గారి అధ్యక్షతలో స్త్రీసమ్మేళనం జరిగెను

సాయంత్రము పం బన్సీలాల్ వ్యాసుగారి భజనలు పం వెంకటేశ్వరరావు, శ్రీమాన్ పం. బన్సీలాల్ వకీలు (మంత్రి ఆర్యప్ర.ని స హైదరాబాదు) గారలవిద్వత్తాపూర్ణభాషణజరిగెను, శ్రీబన్సీలాల్ (మంత్రి ఆర్యప్ర,ని స హైదరాబాదు] గారికి వేదప్రచారార్థము నోట్లమాలవేయబడెను. ప్రతినిత్యము రెండువేల ఉపస్థితి అవుచుండెను

## ఈరానిదుండగాల విచారణ

కాటికాయల ౧౭ ఖుర్దాదు

(ఓ-వి)

రెండుమాసములక్రింద మూపళ్లెలవెంబడి జరిగిన ఈరానిదుండగాలవిచారణకొరకు పోలీసువారికి, యిప్పుడుశ్రద్ధకలిగింది. అసలుఈరానీల మిడతలదండుఊళ్ళమీపడ్డప్పుడే, పోలీసువారితో మొరపెట్టుకున్నాము, నేడుపెండియాల, చినపెండియాల కాటికాయల పటేలు పట్వారిలతో వాఙ్మూలాలుతీసుకున్నారు పోలీసుమరదుగారు మొదలగుపెద్దలు. వీరిఅత్యాచారాలకు గురియైన ఊళ్ళుచుట్టుపట్టుయింకాఉండెను. కాని పోలీసువారు అక్కడికిపోను శ్రమతీసుకొనలేరు, ముఖ్యంగా ఈరానీలు పెట్టితీసుకొనిన బండ్లవాళ్ళు ఆఊళ్ళలోఉండిరి. ప్రజలకష్టనష్టాలపై, ప్రభుత్వమునకుకలిగిన ఈఆతురతప్రజానీకానికి శాంతిభద్రతల ప్రసాదిస్తుందనినమ్మిక-

## ఎనిమిదవ ఆంధ్ర మహాసభ

ప్రతినిధులు, ప్రేక్షకులకు హెచ్చరింపు

చిలుకూరునందు ౨౯-౩౦-౩౧ తేదీలు (౩-౪-౫ జరాన్) తేదులలో సమావేశము కానున్న ఎనిమిదవ ఆంధ్రమహాసభకు రైలుప్రయాణికులవిషయమున మేమియింతవరకే వివరముగా ప్రకటించియుంటిమి. రైల్వేవారితో కన్సెషన్ (తగ్గింపు రేటులు) పోయినసంవత్సరముమాదిరి లభించగలవనితలచియుంటిమి. కాని పురమునకు ఎక్కువ సంఖ్యగా ప్రతినిధులు, ప్రేక్షకులు రైలులో ప్రయాణముచేయనందున, కన్సెషన్లు యివ్వజాలమని తెలిపినారు. చిలుకూరుమహాసభకు పోవుప్రయాణికులు, రైలుఛార్జీలు పూర్తిగ భరించవలసివచ్చున్నది

రైల్వేబస్సులు ఆతేదులలో ఎక్కువగా నడిపించుమని కోరగా వార్కెటుపల్లి, ఖమ్మం, హైద్రాబాదుడిపోలనుండి ఎక్కువగా బస్సులు నడిపించవలెనని ఆయాడిపోలవారికి ఉత్తరువులు పంపబడినవి. రైల్వేబస్సుల ఏర్పాటు లుండును.

హైద్రాబాదు స్థాయిసంఘ కార్యాలయమునుండి ప్రత్యేకమోటారుబస్సులు ఏర్పాటులుకూడ జరుగుచున్నవి. కాని ఈ ఏర్పాటులలో సౌకర్యములు పొందదలచుకొన్నవారు, ఇంతవరకే ప్రకటించినప్రకారము ముందుగా, మా కార్యాలయములో పైకము చెల్లించి తమపేర్లుబుక్కు చేసియుంచవలయును. అట్లుచేయక అప్పటికప్పుడే ఈప్రయాణపుసౌకర్యములకు ఈబస్సుల ఏర్పాటు జరుగజాలదు.

రైలులో వెళ్ళగలచినవారు ఖమ్మంలోదిగి ఖమ్మంనుండి చిలుకూరుకు ప్రయాణము చేయవచ్చును.

ఇట్లు
చిక్కేపల్లి రామచంద్రరావు,
స్థాయిసంఘ కార్యదర్శి
సుల్తాన్‌గూడెం, హైద్రాబాదు.

## నల్లగొండ చెరువులు

హైదరాబాదు (దక్కన్), తీరు ౧౯

ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు. నల్లగొండజిల్లాలో గతసంవత్సరం అతివృష్టివల్ల చాలాచెరువులు తెగిపోయెను దానివల్ల ౧౫ లక్షల నష్టం రైతులకుకలిగెను ౪౩౯ చెరువులున్న 33౭ పెద్ద చెరువులున్ను తెగెను. మూడునెలలలోనే ఆబ్కాషీవారు (నీటుకర్మశాఖవారు—Irri-gation Department) వీటిలోచాలావాటినిబాగుచేసిరి తక్కినవాటిని ఈవానకాలము ప్రవేశించుటకు బాగుచేయుదురు సాధారణముగా ఈపని ౫ ఏండ్లుపట్టేది దీనికింతవరకు ౪ లక్షల ౭౦ వేలు వ్యయమైనది, దీనివలన ౩ లక్షల ఎకరాలభూమి సేద్యయోగ్యమైనది.

## బయటికి పంపివేయుట

హైదరాబాదు[దక్కన్] తీరు ౨౦:

అఖిలభారత హిందూయువజన సంఘాధ్యక్షులైన బాలశా స్త్రీహరిదాసుఅనేవారు నాగపూరువారు వారు హైద్రాబాదునగరములో కొన్నిదినములవరకు రామమందిరములో మహాభారతమును గురించివ్యాఖ్యానాలుచేసినారు. అందులో వారు ఆక్షేపణీయముగా ఉపన్యాసాలిచ్చినారని ప్రభుత్వమువారు అతనినిరాష్ట్రమునుండివెంటనే వెళ్లిపొమ్మన్నారు,

(దక్కన్ క్రానికల్)

# సాంఘిక కలహాలనుగూర్చి గాంధిమహాత్ముని సలహా

## ప్రజలు హింసాపద్ధతితోనైన తుంటరులను ప్రతిఘటించవలెనేగాని పారిపోరాదు

### కాంగ్రెసువారుమాత్రము అహింసాపద్ధతినే తుంటరులను ప్రతిఘటించవలెను

లాలాభోగీలాలాగారికి మహాదేవదేశాయిగారిద్వారా స్వయంగాఅందజేసిన లేఖ

అహమదాబాదు, మే ౨౩

"తుంటరులు వంద్రుదరనిభయపడి జనులుపారిపోవుటసంపూర్ణముగ హీనస్వభావము. హింసావిధానముల్లనో లేక అహింసావిధానముల్లనో తుంటరులను ప్రజలు ప్రతిఘటించుటకు సమర్థులుగానుండవలెను. కాంగ్రెసుసిద్ధాంతమునకు సేవచేసిన వ్యక్తులుసరియైనదని అంగీకరించినచో కాంగ్రెసువారు కేవలంఅహింసాపద్ధతితోనే తుంటరితనమును ప్రతిఘటించవలెను. వారిప్రయత్నము తప్పకుండా సఫలమగును- తుంటరులకుభయపడి జనులుపారిపోవుట కేవలంపిరికితనమే. జనులు తుంటరులను అహింసాపద్ధతిచే ప్రతిఘటించవలెను- అది ఉత్తమమైనపద్ధతి- జనులుఅట్లుచేయలేనిచో హింసాపద్ధతితోనైనను వారుతుంటరులను ప్రతిఘటించవలెనేగాని పారిపోగూడదు." అనికాంగ్రెసువారు ప్రజలకందరికిస్పష్టముగా తెలియజేయవలెను. ఈవిధముగా, అహమదాబాదులో సాంఘికకలహాలను, తుంటరులఅల్లరులనుఅణచుటనుగురించి గాంధిమహాత్ముడు గుజరాతురాష్ట్రీయ కాంగ్రెసు సంఘకార్యదర్శి లాలా భోగీలాలుగారికి వ్రాసిన లేఖను మహాత్ముడు మహాదేవదేశాయిగారిచేత భోగీలాలుగారికిపంపినాడు మహాదేవదేశాయిగారాలేఖనుతీసికొని సేవాగ్రామమునుంచి అహమ్మదాబాదునకువచ్చిరి. దేశాయిగారు దానిస్వయముగా భోగీలాలుగారికిచ్చిరి- దానిలో మహాత్ముడీరీతిగావ్రాసెను:-

"మృదులాబెహనుకన్య, గులజరీలాలు నందగారలిద్దరితోను వాలుగురోజులనుంచి దాపరికములేకుండామాట్లాడితిని- దానినిగురించి మేముముగ్గురము సాకల్యముగాచర్చించితిమి. మీరును జీవనలాలు దివానుగారునుకూడ సేవాగ్రామమువచ్చినచో మనమైదుగురముకలసి మాట్లాడివుందుము. అందువల్లకర్తవ్యమును నిర్ణయించుటలో మీరునాకుచాలాసహాయముచేసివుండెడివారు- సాంఘికకలహాములుజరిగినప్పుడు కాంగ్రెసువారు చేసినపనివారు తమకర్తవ్యమునునెరవేర్చకపోవుట, వారిటువంటిపనిచేయవలసినపని వీటిని మూడిటినిగురించి కొందరొకవిధముగాను, మరికొందరుమరొకవిధముగాను అభిప్రాయపడుచున్నారని నాకుతెలిసినది.

#### సలహాసంఘము

మహాదేవదేశాయి (అధ్యక్షుడు), నరహరిపారేఖు (ఉపాధ్యక్షుడు), లాలాభోగీలాలు, గుల్జారీలాలునంద (కార్యదర్శులు) జీవనలాలుదివాను మృదులాబెను సారాభాయి, ఇందుమతిబెన్నుచినులాలు, ఖండుభాయిదేశాయి, రావుజీభాయిపటేలు [సభ్యులు] గార్లతోకూడిన ఒకసలహాసంఘము ఏర్పరచవలెను- ఆసంఘము వారిసలహాప్రకారమే పనులన్నియు జరుగుచుండవలయును- మహాదేవదేశాయిగారు యెల్లప్పుడు అహమ్మదాబాదులోవుండజాలరు- గాని వారుముఖ్యముగా వుండవలెననిమీరందరుయెప్పుడు కోరుదురో అప్పుడుఅక్కడికివారు వచ్చుచునేయుండగలరు-

#### అహింసా పద్ధతియందు విశ్వాసహీనులు

ఎతరులప్రాణాలనుగాని, తమప్రాణాలనుగాని కాపాడవలసివచ్చినప్పుడుకూడ అహింసాపద్ధతినేఅవలంబించవలెనను దృఢవిశ్వాసముగలవారు కాంగ్రెసువారిలో యెంతమందివున్నారో మీరునిర్ధారణగా తెలుసుకొనవలెను. దౌర్జన్యపద్ధతిఅవలంబించవలసినదేగాని వీలులేదనితలచువారుకాంగ్రెసునువదలివేయవలెను. అటుతరువాత తమకుయుక్తమనితోచినపద్ధతిని నిర్ణయించుకొనవలెను. ఆప్రకారముయితరులుకూడా నడుచుకొనునట్లు చేయుచుండవలెను.

#### కాంగ్రెసు కర్తవ్యము

ఈవిషయములోకాంగ్రెసువారు తమపద్ధతిని స్పష్టపరచి నిర్ధారణచేసికొనవలెను. లేనిచో కాంగ్రెసుకు చాలాఅపఖ్యాతికలుగును. ఇటువంటిసమయములలో కాంగ్రెసువారు దౌర్జన్యపద్ధతినేఅవలంబించవలెను, అదికాంగ్రెసుసిద్ధాంతమునకు విరుద్ధముకాదని కాంగ్రెసువారిలో మిక్కిలిహెచ్చుమంది గట్టిగానమ్ముచున్నచో వారాసంగతినిస్పష్టముగాతెలుపవలెను, ఆప్రకారముగాజనులునడుచుకొన్నట్లుకూడవారుచేయవలెను, ఇపుడుకాంగ్రెసు నాయకులలోచాలామంది చెరసాలలలో వున్నారని కాంగ్రెసువారెవరును సంకోచించవక్కరలేదు- వారువెంటనే తమఅభిప్రాయమును స్పష్టముగాతెలుపవలెను- ఇప్పుడువెంటనేయేదో ఒకఅభిప్రాయమును స్థిరపరచుకొనవలెనుగాని ఆలోచనలతోకాలయాపనచేయగూడదు- ఇపుడువారు చేసినవిర్ణయముసరియైనదికాదని తరువాతవారికి తోచినచో వారుదానిని మార్చుకొనవచ్చును- కాంగ్రెసువారందరును తమకర్తవ్యమునుసరిగానెరవేర్చియున్నచో యిటువంటిదురాగతములుజరిగివుండేవికావు-

దౌర్జన్యమునందు నమ్మకమున్నవారుప్రభుత్వమువారి పోలీసుసహాయమును, మిలిటరీసహాయమునుకోరవచ్చునుగాని అహింసానిరతులు సహాయమునుకోరగూడదు- దౌర్జన్యపద్ధతులలో తుంటరులనుప్రతిఘటించుట జనులకునేర్పు- కాలింభావాలతో అహింసానిరతులకు ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని యేమియుసంబంధము వుండగూడదు-

#### దౌర్జన్య పద్ధతి నియమములు

దౌర్జన్యపద్ధతి నవలంబించువారుకూడ కొన్ని నియమముల నవలంబించవలెను- నిరపరాధియైన ఒకమనుష్యుని నిష్కారణంగా యెవరును చంపగూడదు- దేశములో యెటువంటిపరిస్థితులు కలిగినను జనులు పిరికిపందలుగాను, పౌరుషహీనులుగానువుండకూడదు- ఇదిమిక్కిలి ముఖ్యమైన విషయము-తుంటరులతో పోరాడగోరువారు తుంటరులుగా వుండనక్కరలేదు-దొంగతనముగా వెనుకనుంచి ఒకనినికత్తితోపొడిచి పారిపోవువాడు ధైర్యశాలియని యెవరునుఅనరు-

#### వ్యతిరేకపక్షముల సహకారము

దేశములో శాంతిని నెలకొల్పుటకు కాంగ్రెసువారు ముస్లింలీగు, హిందూమహాసభ మొదలైన అన్నిపార్టీలవారితోకలిసి పనిచేయవలెను- కాంగ్రెసువారికి యేపార్టీమీదనుద్వేషములేదు- అడవులలో క్రూరజంతువులు పోట్లాడుకొనునట్లు పట్టణములలో మనుష్యులు పోట్లాడుకొనుట మిక్కిలిఅనుచితము గనుకయీదుస్థితిని తొలగించుటకు అన్నిపార్టీలవారుకలిసిపనిచేయవలసినదే- ఇట్లుకాంగ్రెసువారన్నిపార్టీలవారిని కోరవలెను-వారంగీకరించకపోయినందు కాంగ్రెసువారుతమకర్తవ్యమును చేసినవారగుదురు, కాంగ్రెసువారెవరినిగాని పొగడగూడదు.

#### నష్టపరిహారము

అల్లరులలో నష్టముకలిగినచో దీనికి పరిహారమిమ్మని కాంగ్రెసువారుకోరగూడదు, అదికాంగ్రెసువారిపనికాదు. తమసొత్తులనుకాపాడుకొనుశక్తి జనులకులేకపోవుటవల్లనే వారిసొత్తునితరులు అపహరించిరి కనుకఆనష్టమునుప్రజలేభరించవలెను. నష్టపడినవారికి ప్రభుత్వమువారు పూర్తిపరిహారమునియ్యగోరినను వారియ్యగూడదనియే నా అభిప్రాయము.

#### దర్వానులు

తమఅర్థప్రాణములను కాపాడునిమిత్తము భయ్యాలు, సిక్కులు, ఫాకుర్లు, మొదలైనవారిని దర్వానులుగానియమించగూడదు, అన్నితరగతులవారిలోను పడుచువారందరును తాలింఖానాలలో శౌగాతరిబీతునుపొందవలెను. ఇతరులను దర్వానులనుగా నియమించినవారు నియమించబడినవారికిలోకువగుదురు. దీనివల్లతుంటరితనము అధికమగునేగాని తగ్గదు.

#### నిషిద్ధములు

ముసల్మానులసంఖ్య హెచ్చుగావున్నవీధులలో నివసించుహిందువులును హిందువులసంఖ్య చాలాహెచ్చుగావున్నవీధులలో నివసించు ముసల్మానులు తమయిండ్లనువదలి అలువిడ్డలతోకూడా పారిపోగూడదు. తమవీధులలోవున్న ముసల్మానులకు హిందువులు సంపూర్ణమైనరక్షణనియ్యగవలెను. ముసల్మానులవీధులలోవున్న హిందువులుతమ ప్రాణాలుపోవువరకు ఆవీధులలోనుంచి వెళ్ళిపోగూడదు. చీటికిమాటికి వర్తకులు దుకాణాలను మూయ్యగూడదు. వర్తకులందరు తమప్రాణవిత్తములనుకాపాడుకొనుటకు సమర్థులుగా అందరును యిట్టిధైర్యమునుకలిగివున్నచో వారికధికమైననష్టముకలుగ నేరదు, ఈఅల్లరులుత్వరలోనే అంతరించిపోవును. పాశ్చాత్యదేశములలో యిటువంటిఅల్లరులెన్నడునుజరుగవు. అక్కడప్రజాకలహాలుజరుగునుగాని వాటికికారణములువేరు. అదేశాలలో ప్రజలెవరును ధైర్యహీనులుగా వుండరు. వారుపారిపోరు. వారుపోలీసువారిసహాయమును కోరరు. దొంగలవిషయములోమాత్రమే పోలీసువారిసహాయమునుకోరుదురు, ఈవిషయములో మనదేశంలోకొందరు ఘాతుకమృగములతోసమానులుగావున్నారు. మరికొందరు పిరికిపందలుగా వున్నారు.

---

౪ వ పేజీ తరువాయి

౧౯౩౧ సం॥ జనపరిగణనబట్టి ముదిరాజ జాతిసంఖ్య ౭ లక్షలకన్న నెక్కువగానున్నది. వారిలో ౩౭౨౫ పురుషులు ౩౩౨ స్త్రీలుమాత్రము విద్యావంతులు ఈసంఖ్యఎంత విషాదపుగాథను బయలుపెట్టుచున్నదో మీరొక్కమారాలోచింపుడు! ఇట్టిహీనపరిస్థితులలో జాతివృద్ధికాగలదని మీరుఆశింపగలరా! ఎన్నటికినికాజాలదు! పిల్లవానికివిద్య నెప్పుడు నేర్పవలయునని ఒకజపానీనడుగగా, పిల్లవాడుపుట్టుటకు ౨౦ సంవత్సరములకు ముందేయారంభింపవలయునని అతడుజవాబు చెప్పెనట. అనగా పిల్లలనుగనుతల్లులకు మొదలు విద్యకావలయునని దీనిభావము, తల్లియొక్కపరిజ్ఞానముపిల్లలమనశ్శక్తులను మేల్కొలుపుటలో యెంతయోతోడ్పడునని పరిశోధనలుచేసి విద్యావారంగతులు నుడువుచున్నారు. కాబట్టిమనబాలరలకొక్కడవిద్యామందిరంబు నెలకొల్పవలెను, ఆచ్చట నెబాలికలకుకూడ విద్యగరుపుటకేర్పాటు చేయవలయును.

#### ముదిరాజ వసతిగృహము

కొంతకాలమునుండి ముదిరాజసంఘమునకు, సరియైనవసతిగృహాలోపము కానవచ్చుచున్నది. జిల్లాలలోను, హైదరాబాదునగరమునందును యున్న ముదిరాజసోదరులుకూడా దీనియవసరమును గ్రహించి ప్రసంగించియున్నారు. నేడుమీకు ఈ వసతిగృహావసరవిషయమై బాగుగనాలోచింపవలయును. ఈమహాసభలో వసతిగృహస్థాపనకుద్దేశించినతీర్మానమును ఆమోదించవలెనని మీరందరుదానిమూలధనమునకై విశాలహృదయముతో విరాళములనివ్వవలయుననిప్రార్థన.

#### మద్యపాన నిషేధము

మానవునిజీవితమునకు ముగ్గురుభయంకర విరోధులుగలరు. మొదటిదిమూర్ఖ్యము, రెండవదిసారాయి, మూడవది దారిద్ర్యము ఈసారాయిఎన్నినిండుగృహముల రూపుమాపినదో ఎవరికెరుక! ఈమహాభూతమె మేరలేనిఘనతర సామ్రాజ్యముల ప్రపంచపటములనుండి పూర్తిగాతుడిచివైచినది శుభాశుభకార్యములలో ఈపిశాచమునుమీ. ఇండ్లవైపు తొంగిచూడనీయవలదు. ఈసందర్భములో అనేకులు కల్లుసారాయి వాడుటవలన అనేకకుటుంబములను నాశనముచేయుచున్నారనియు అందువల్లకలిగెడిపాపములకు భాగస్వాములై తమయఘభరమును ఎక్కువ చేసుకొనుచున్నారనియును మనకులపెద్దలను హెచ్చరించుచున్నాను, వారుస్వయముగా కల్లుసారాయివదలియితరులుకూడా వాటినిపరిత్యజించునట్లుచేయవలయును- లేనిచో మనజాతియుపకులిట్టిదుర్మార్గమును యింకయెంతమాత్రమును సహింపజాలదు.

#### ప్రొఫెసర్ మాక్సుముల్లరుంయభిప్రాయం

"నేను బాల్యవివాహములు శ్రుతిస్మృతులలో నెక్కడనంగీకరింపబడలేదని చూపియున్నాను. ఇప్పుడుఏపండితుడుకూడ దీనిని పూర్వపక్షముచేయ జాలకుండుటజూచుచున్నాను, పురుషుడు గృహస్థాశ్రమమునకు అర్హుడైనప్పుడే పెండ్లాడవలయునని మనుస్మృతము- ఆడపిల్లలుకూడ వివాహములకుఅర్హులైనప్పుడే వివాహమాడవలయును"

#### డాక్టరుస్మిత్తుచెప్పునదేమన

బాల్యవివాహములు హిందూదేశములో శరీరమునకు నష్టమునుకలుగజేయుటయేగాక, మెదడునుకూడచెరపునని నాకు గట్టినమ్మకముగలదు- బాల్యవివాహమువల్ల కొన్నాళ్లకు కొందరగాయబుద్ధి కుదురును-అది అస్వాభావికము సాధారణఆరోగ్యమునకు భంగమువాటిల్లును-అయుక్షీణత భావిసంతతి బలహీనముగపరిణమించుటదీ నివల్లనష్టములు-

[హిందూసోషలు రిఫార్మరు-పుట ౨౩]

నాయుద్దేశ్యములో బాల్యవివాహమును, చట్టముద్వారా నిషేధింపవలయును. మనశాసన నిర్మాణసభ బాల్యవివాహసంబంధమైనబిల్లునుతో నివేసినదని నాకుతెలియును- ఇదికాలమాహాత్మ్యము-మనశాసనసభ ఈసమస్యనుఅంగీకరించుకొని శీఘ్రముగాకాగలదని నానమ్మకము-

ఈసందర్భములో మరొకవిషయమును మీకు మనవియందించుచున్నాను- మనసంఘములోకూడ వరదక్షిణయను అంటువ్యాధి చెలరేగుచున్నది- దీనియర్థమేవరవిక్రయమగునేమో, మనపిల్లలవివాహమునకు బదులుగా వర్తకసరణిచేయుచున్నామని యెరుంగదగును. దీనినికూడనూపుమాపుటఅత్యవసరము-

నేనుప్రభుత్వమునకు ముదిరాజసంఘమునకుక్కవ్యాదుమైనకోరికలు సమర్పించుచున్నాను ప్రభుత్వమువారు మాకోరికల నంగీకరించెదరని నేనుగట్టిగానమ్ముచున్నాను-

౧ ముదిరాజసంఘపుపిల్లలకై విద్యార్థివేతనముల ప్రత్యేకముగనొసగుట

౨ మాధ్యమిక ఉన్నతపాఠశాలలలోను విశ్వవిద్యాలయములోను జీతములుతీసుకొనకయే పిల్లలనుచేర్చుకొనుటకై ఒకఆజ్ఞాపత్రము దయచేయవలయును

౩ విద్యపూర్తిచేసినవిద్యార్థులుసాంకేతికవిద్యలనభ్యసించుటకై ప్రత్యేకవిద్యార్థివేతనము లొసగుట-

౪ గెజెటెడుఉద్యోగములయందు అనగా కహ్శీలుదారు మొదలగుఉద్యోగములకు ముదిరాజులోనసమర్థులగువారిని నియమించుట-

౫ భూపరాధీన శాసనములోప్రత్యేకింపబడిన జాతులయొక్కపట్టికలో "తెలంగా" అనివ్రాయబడియున్నది "తెలంగా, ముతరాసి, ముతరాచ"లంటు కంబల్లీరు,అనునవి ముదిరాజశబ్దముయొక్క అపభ్రంశములుకాబట్టి తెలంగాఅనుశబ్దమునకుమారుగా "ముతరాసి ముతరాచ"లేక ముదిరాజఅనిచెప్పినప్పుడు అధికారులు ఈమాటలు ఖానాలలో కానరాకపోవుటవల్ల వారిదరఖాస్తులుత్రోసివేయబడుటగాని లేక తిరిగియిచ్చివేయబడుటగాని అతిసులభముగా సంభవించుచుండును-కాబట్టి ప్రత్యేకింపబడిన జాతిపట్టికలో తెలంగాశబ్దమునకెదుట ముదిరాజ ముతరాసి ముతరాచ మరియు కంబల్లీరు అనుపదములనుచేర్చి ఈ జాతికిసంభవించుచున్న ఘోరనష్టములనుండి రక్షింపవలయును

౬ ముదిరాజులనుమువారు గ్రామోద్యోగములలో పూర్వకాలమునుండియు నియమింపబడియున్నారు వారిజీతములు అసఫ్ జాహీ ప్రభుత్వస్థాపననుండియు ఇప్పటికిని ఒకేవిధముగానున్నవి కాని వారిశ్రమయు హాజరి అరోకారోజాఎక్కువైనవి నీరీచిన్న జీతములమీదనే తమజీవితములను గడుపుచున్నారు కాలపరిస్థితుల ననుసరించియు ధరలు పెరుగుటవల్లను వారియవసరములు ఎక్కువగుచుండుటవల్లను వారిజీతములను వృద్ధిచేయుటకవసరమున్నది.

౭ మాతృభాషలోనిర్బంధముగా విద్యగఱపుటను సాధ్యమైనంతత్వరలో ప్రవేశపెట్టి ఈసంఘములోనిమూఢత్వమునుదూరముచేయవలయును- అంతవరకువిద్యాభివృద్ధి అసాధ్యము-

౮ రానున్న సంస్కరణములు ఆచరణలోకివచ్చినప్పుడే సభ్యులపేర్లనిర్ణయింపబడునప్పుడు ముదిరాజసంఘమునుండి ఇద్దరిని నామినేట్ చేయవలయును, ఏలనన నిజాము రాష్ట్రపు ౧౯౩౧ జనపరిగణనమునుబట్టి ఏడులక్షలకంటెఎక్కువగా ముదిరాజజాతీయులున్నారు-

జిల్లాలలోను హైదరాబాదుపట్టణభాగములలో నుస్థాపింపబడినపాఠశాలలకు ప్రాథమికపాఠశాలాసంఘమువారవసరమైనంతసాయమొసగవలయును.

౧౦ పూర్వకాలమునుండియు ముదిరాజసంఘము యుద్ధసంబంధమైన వృత్తియందుండియున్నది గానఆసంఘములకు సైనికఉద్యోగము నిచ్చుటయందుఎక్కుడు అవకాశములనివ్వవలయును,

మనము సిపాయిసంతతివారము- మనరక్తము శతాబ్దములలోఇప్పటికిని మనపూర్వులవీరరక్తము ప్రవహించుచున్నది-, అసఫియాసంతతివారితో మనము విశ్వాసపాత్రులుగానున్నప్పుడు బ్రిటిషుప్రభుత్వముతోకూడా మనకు అదేసంబంధము, మనప్రభుత్వముకొరకు మనపూర్వులు ఎన్నిబలిదానములనో చేసియున్నారు- మనముకూడఎట్టిత్యాగముకైనసిద్ధపడవలెను- మనకీఅసఫియాకంటియాలసైన్యములతోను హైదరాబాదు సహాయక సైన్యములతోనుసంబంధమున్నది ఈసైన్యములుఅర్వాచీనయుద్ధములలోను సరిహద్దుప్రాంతముల యుద్ధములలోను చూపినకార్యము చెదరునవర్దనున్న పతకములవల్ల స్పష్టమగుచున్నది- నైజాం రాష్ట్రములోనున్న ౧౦లక్షలముదిరాజసంఘీయులు బ్రిటిషుసామ్రాజ్యసంరక్షణవిషయములో బలిదానముచేయసాసిద్ధులమని ప్రతినచేయుచున్నాము మనసోదరబృందములోచాలమంది ప్రస్తుతపు యుద్ధరంగమునందుండుటయే దీనికితార్కాణమనియు నేను బ్రిటిషుప్రభుత్వమునకు మనవిచేయుచున్నాను-

యువకులను మరలప్రత్యేకముగా నుద్బోధించుచున్నాను- విద్యాప్రచారముచేసి మనజాతి అజ్ఞానతిమిరముల బారద్రోలుటలో, రాజభక్తి కర్తవ్యమునుభంగముగానట్టిమార్గముల మద్యపాన నిషేధకార్యక్రమమును ఆచరణలోపెట్టుటయు పిల్లలనుమరళ్యాన మనుషావాసమునుండి రక్షించుటయు, సోమరితనమును పారద్రోలి పారిశ్రామికవిద్యలనేర్చుకొని, వాటినినెలగొల్పప్రయత్నించి సాధించుటయు వారిభారము-

---

### ఏనిమిదవ

# ఆంధ్రమహాసభ

## చిలుకూరు, హుజూరునగరు తా॥ నల్లగొండ జిల్లా

౨౯, ౩౦, ౩౧ తీరు ౧౩౫౦ ఫ.

విషు: జ్యేష్ఠ శు॥ ౮, ౯, ౧౦

అధ్య: శ్రీ రావి నారాయణరెడ్డిగారు

అధ్యక్షురాలు: శ్రీమతి రంగమ్మ ఓబులురెడ్డిగారు

ఆంధ్రసోదరీ సోదరులందరు పాల్గొనవలెను.

---

# గోలకొండ గ్రంథాలయం

## మణిమేఖల

కర్త "శ్రీకవితిలక పులవర్తి కమలావతీదేవిగారు ప్రచురణకర్తలు ఆణా గ్రంథమాల, గజ్జర్ హవేలి, త్రూపుబజారు, హైదరాబాదు (దక్కను) ప్రచురణకర్తవద్దనే దొరకును. వెల ఒక అణా హాఫ్ రమ్ పుటలు.

కర్త్రవాతీవవారు ప్రసిద్ధులు. విషయము చంద్రగుప్త మౌర్య కాలమునాటిది. విశేషభాగము ముద్రారాక్షసములోను చాణక్యచరిత్రలలోను చంద్రగుప్తచరిత్రలోను కలయంశములు. మణిమేఖల అను శ్రీమతిగారేసృష్టించిరేమో, ద్రావిడదేశంలో మణిమేఖల అను పేరుగలకథయాదేమి అని స్మరించును కాని అదియిది కాదు. ఈకథను ఒకచెద్దనవలగా సుందరముగా చారిత్రకముగావించుటకువీలు అను ఇందలిభాషవిశేషముగా గ్రాంథికమేయైనను వ్యావహారికంకూడా వ్యక్తమగుచూ ఉన్నది. గ్రంథములోని మొట్టమొదటివాక్యం, "అయ్యది ౯౭౫ సంవత్సరము" అనివ్రాసినారు అదేమిటో అర్థముకాలేదు. చంద్రగుప్తుడు క్రీస్తువకు పూర్వ ౩౨౦ ఏండ్లక్రిందటివాడు మణిమేఖల ౧౭ ఏండ్లవాడువరించినది. తర్వాత ౭౦ ఏండ్లకుని నామాపాడినది. అనగా తన ౨౦౦ శేఖ ౭౦ ఏట వివాహమాడినట్లు ఇందుచూపినారు ఆకాలమునఅంతటిసంస్కారముండెనా? అది సంశయమే కథమొత్తమువిూద అకర్షణీయముగా ఉన్నది. ఈకాగితాలగిరాకిలో ౫౦ పుటల గ్రంథాన్ని ౧ అణాకియిచ్చుచున్న యీఅణా గ్రంథమాలవారి శ్రమను మేము ప్రశంసించుచున్నాము కాని అణాకుమారుగా రెండణాలక్రయమునకునిర్ణయించి గ్రంథాలను అచ్చుటబాగుండునని సూచించుచున్నాము.

—

## నా భారతదేశయాత్ర

కర్త అసలు బ్రెయిల్ స్మిత్ అనువాదకుడు శ్రీకాకర్ల నారాయణరావుగారు ప్రకాశకులు దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదు పుటలు ౧౨౮ వెల ౦-౬ అణాలు

ఇది బ్రెయిల్స్ఫర్డుఅను ఆంగ్ల గ్రంథకర్త ౧౦ ఏండ్లక్రిందట వ్రాసిన రెబెల్ ఇండియా అనుగ్రంథానికనువాదము అనువాదకులు మంచితర్జుమాలో కూడిన యువకనాయకులు, భాషబాగాఉన్నది. ౧౦ ఏండ్లనాటిదైనను అందలిదిలువతగ్గలేదు. ఈ ౧౦ ఏండ్లలోవచ్చిన మార్పులు అనువాదకులు పుటలఅడుగున అక్కడక్కడ వ్రాసినారు అదొకఅందాన్ని కూర్చునట్టిపద్ధతియే గ్రంథము చాలాబాగాఉన్నది మనభారతదేశ రాజకీయాందోళనచరిత్రలో అదిముఖ్యఘట్టముకావున ఆంధ్రులు దీనినవశ్యము పఠించవలెను.

—

## మైత్రాకథలు

అనువాదకులు-చక్రపాణి ప్రకాశకులు. యువకార్యాలయం, తెనాలి, పుటలు ౧౦౨ వెల ౬ అణాలు

రవీంద్రనాథ మైత్రా అనేవారు వ్రాసిన కథల కనువాదం- చక్రపాణి యెవ్వరో పేరు తెలుపుకొనలేదు-కాని అనువాదం చక్కగా ఉన్నది- మైత్రాయెవ్వరో వారేమిరచించినారో అవిషయంకాస్త పీఠికవ్రాసి తెలిపితే బాగుండేది - కథలను పేరుపట్టిచూస్తే అతడు బెంగాలీగాకనబడుచున్నాడు-ఇందు నాలుగుకథలున్నవి, అన్నియు ఉత్తమస్థాయిలోనివే- భావప్రధానమైనట్టివి, కామప్రధానమైనవికావు- ఈపద్ధతిలో వ్రాయుటకష్టము-వీటిలోనిరమ్యత, వర్ణించుటకన్న చదివి ఆనందించుటయే శ్రేష్ఠము- మొదటిది "పరాజయం" అనుకథ- కథలో పేచీఏమిన్నీ లేకున్నా ప్రతివాక్యం ఆనందదాయకంగాఉంది-"మెల్లి" అనేరెండోకథ సహజంగా ఉంది- ప్రత్యర్పణం పరాయిఅబ్బాయిఅనే కథలు హృదయవిదారకములు-

బెంగాలీలోని ఉత్తమసాహిత్యమును ఆంధ్రులకందించు యువకకార్యాలయంవారు ధన్యులు, గ్లేజుకాగితాలలో ముద్రించినారు- ఇప్పటి కాగితాలగిరాకీలో ఈగ్రంథం వెల ఎక్కువకాదు- మైత్రాకథలు ఆంధ్రకథలకు ఆదర్శముగా ఉండగలవని చెప్పితే అంతయూ చెప్పినట్లే.

— —

## భారతీయ నాగరికత

కర్త మాండూరు శఠకోపాచార్యులుగారు, ప్రాప్తిస్థానము గ్రంథకర్త, కాకినాడ వెల: రూ౧-౦-౦

ఇది రెండవభాగమని గ్రంథకర్తగారు తెలిపినారు. వేదకాలము నుండి గాంధీకాలమువరకు భారతీయులు అహింసాసంస్కృతుల నెట్లు పోషించుచువచ్చినారో ఈగ్రంథములో సప్రమాణముగా శాస్త్రయుక్తముగా సమగ్రముగాను చర్చించినందులకు గ్రంథకర్తగారిని అభినందించుచున్నాను గ్రంథములో అనేక చిత్రపటములు కలవు. గ్రంథాంతమందు హిందూముస్లిం క్రిస్తవు లపందుగలతత్త్వమును వర్ణించుచు వాటినికూడ తమఅహింసాసిద్ధాంత క్షేత్రలోనికి తీసుకొన్నారు. ఇదిప్రత్యేకముగా భావింపవలసియుండును గ్రంథకర్తగారు సుప్రసిద్ధులు.బహుగ్రంథాలను వ్రాసినారు, ఇట్టియుద్గ్రంథాలను వీరినుండిచూచుటకును చూచి లాభము పొందుటకును ఆంధ్రులుకాసవహకుదురు,

—

## ఆనందవాణి-సంవత్సర సంచిక

౭౭ పుటలు వెలనాలుగణాలు. మద్రాసునుండి వెలువడు వారపత్రికయొక్క వార్షిక సంచిక ఇందు సినిమాపటాలుచాలాకలవు. కొందరి దేశనాయకులపటాలునుకలవు. విషయాలలో కొన్ని సినిమావిమర్శలును అనేకకథలును కలవు. కొందరు పేరుపొందినవారు వ్రాసినకథలున్నవి. కథలతోపాటు కొన్ని చారిత్రకఘట్టాలు. భాషాపకోపములనుకలిగించు ఉత్తమవిషయచర్చలు కూడ సేకరించిముద్రించిన బాగుండెడిది

ఆనందవాణి తెలుగువారపత్రికలలో పేరెన్నికగన్నది మంచిప్రచారము గడించినది. ఆనందవాణికి నిత్యాభివృద్ధి దీర్ఘాయువును కోరుతాము.

— —

## బ్రిటనుయొక్క అసంగత వైఖరి

### భారతదేశాన్నిగూర్చి ఒక అమెరికా విలేఖరి అభిప్రాయము

జార్జిసెల్డిస్ అను అమెరికావిలేఖరి ఇటీవల అమెరికాకువచ్చియుండి మే ౨౧వ తేదిన కలకత్తామీదుగా చైనాకుపోవుటకుముందు 'యునైటెడ్ ప్రెస్సు' ప్రతినిధితో ఇట్లుచెప్పినాడు -

"భారతదేశానికి స్వాతంత్ర్యమునీయకుండా, తానుదాస్యబంధితములైన దేశముల స్వాతంత్ర్యముల కై యుద్ధముచేయుచున్నానని ఇంగ్లాండు చెప్పుచున్నపుడు, భారతదేశసమస్య విషయంలో బ్రిటనుయొక్క వైఖరి చాలావిచిత్రమైనఅసంగతముగానున్నట్లు నేనుఅనుకోలేకుండాఉన్నాను"

గాంధిమహాత్ముని చూడజాలనందుకు సెల్డిస్ గారు విచారపడిరి మహాత్ముడు రాజకీయములను గొప్పనైతికస్థాయికి ఉద్ధరించినవారని సెల్డిస్ గారు చెప్పిరి. ప్రపంచచరిత్ర వ్రాయునపుడు గాంధిమహాత్ముని ప్రపంచస్థితిని ఇపుడున్న దానికంటె బాగు చేసి భౌతికవిషయములకు ఎక్కువప్రాధాన్యమిచ్చుటకుయత్నించినవారినిగా వర్ణించగలరని సెల్డిస్ గారుచెప్పిరి. సంస్థానములనుగురించి వారుఅనలే గందరగోళముగానున్నస్థితిని సంస్థానములుమరింతగందరగోళమునకు దెచ్చినవనిరి. సంస్థానాల ప్రజలుఅజ్ఞానములోను, మూఢవిశ్వాసములలోను ఉన్నారనియు, సంస్థానాధిపతులు కేవలము నిరంకుశముగావర్తించుచున్నారనియు, ఇందువల్లకాలప్రవాహమునకంటె సంస్థానములుచాలవెనుకబడియున్నవనియువారుచెప్పిరి.

యుద్ధమునుగురించిమాట్లాడుచు సెల్డిస్ గారు అమెరికామాటలతో చెప్పకుండానే యుద్ధంలో దిగినంతపనిచేయుచు బ్రిటనుకు యుద్ధసామగ్రిని పంపుచున్నదనియు, బ్రిటనుయొక్కనౌకాబలము అప్రతిహతమైనదిగనుండుటవలనను, బ్రిటను తప్పకజయించగలదనిరి హెస్ గారుజర్మనీనుండి లేచివచ్చుటకుముందే జర్మనీలో నాజీపార్టీలో విచ్ఛేదముపుట్టినదనిరి

═

## శతాధిక భాషి

"భారతదేశభాషలపరిశీలన" (లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ఇండియా) అనుగ్రంథమును రచించిన సర్ జార్జిగ్రియర్సన్ అనువారు చేంబర్లీలో ౯౦వ ఏటమరణించినట్లు ప్రకటించబడినది. వీరికి భారతదేశంలోని ౧౭౯ భాషలు, ఆభాషలలో ౫౪౪ ప్రాంతీయభేదములు తెలుసును వీరుతామువ్రాసినగ్రంథమునకై ౩౩ ఏండ్లుపరిశీలనజేసిరి ౨౦ సంపుటములుపూర్తిజేసిరి వారి ౭౦వఏట వారు కాశ్మీరిఘంటువులో రవభాగము, కడపటిభాగమునుపూర్తిజేసినారు.

—

## చందాదారులకు మనవి

చందాదారు లు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు పంపునపుడు తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధ గైకొనుటలేదు. చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింప కోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.

